# ప్రపంచ పరిస్థితులను కనిపెట్టి స్వాతంత్ర్యము సాధించవలెను

## విదేశములలో మన విజ్ఞాన గౌరవ ప్రచారము చేయవలెను

## గాంధి మహాత్ముని నాయకత్వము మనకిపుడవసరము

(3వ పేజి తరువాయి)

యెడల మనకట్టి భారమును లేదని డి వాలరా గారు స్పష్టీకరించినరీతిగా నేనుగూడ నొక్కి వక్కాణించుచున్నాను ఇంగ్లాండుతో భారతదేశమున కట్టి వాణిజ్యానికి సంబంధము ఉండవలెనో నిర్ణయించుటకు భారతదేశమునకు సంపూర్ణస్వాతంత్ర్య ముండగలందులకై మనము బ్రిటిషువారితో పోరాడుచున్నాము. మనకట్టి స్వయంనిర్ణయాధికారము లభించినయెడల బ్రిటిషువారితో మనము అన్యోన్యానురాగముతో మెలంగుట కెట్టియాక్షేపణయు నుండదు.

స్వాతంత్ర్యనము రానంతరము పునర్నిర్మాణము

ఈ జాతీయ స్వాతంత్ర్య సమరములో కాంగ్రెసుయొక్క విధ్యుక్తధర్మ మెటువంటిదో కాంగ్రెసువాదులలో చాలమంది స్పష్టముగా గ్రహించుటలేదు. దేశమునకు స్వాతంత్ర్యము లభించినప్పుడు కాంగ్రెసుపక్షముయొక్క ఆశయము సిద్ధించినట్లగుననియు అటుపిమ్మట పక్షమునకది అంతర్ధానము కావచ్చుననియు నామిత్రులు కొందరు భ్రమించుచున్నారు. ఇది గొప్ప పొరపాటు. ఏపక్షమువారు దేశస్వాతంత్ర్యమును సాధింతురో అదియే స్వాతంత్ర్యసమరానంతరము దేశమును పునర్నిర్మాణము చేయవలసియుండును. అట్టి పునర్నిర్మాణమును చేయుటకు ఆపక్షమునకు ప్రభుత్వాధికారము చేతిలో నుండవలెను. తదితర పక్షములవారు అధికారపదవులలోనికి వచ్చినయెడల జాతినంతను సమూలముగా పునరుజ్జీవింపజేయగలశక్తి వారికి యుండజాలదు ఆత్మధైర్యము గాని, అంగబలము గాని ఉన్నతాదర్శప్రభావము గాని తదితరపక్షములకుండదు. స్వల్పాధికారముగల రాష్ట్రీయప్రభుత్వములలో ఈభేదము కనిపించుచునే యున్నది. కాంగ్రెసు మంత్రివర్గములు చేసినపనులకును, చేయుచున్న పనులకును అంతకుపూర్వము తదితరపక్షముల మంత్రివర్గములు చేసినపనులకును గన్పించెడి భేదమునకు పై చెప్పినవే కారణములు.

* * *

కాంగ్రెసు నిరంకుశాధికారము పొందదు

స్వాతంత్ర్యమును సాధించినపక్షమువ ప్రభుత్వాధికారము వహించినయెడల దేశమునంతను ఒక్కపక్షములో కలిపివేయుట సంభవించునని కొందరు వాదింపగలరు దేశమంతయును ఒక్కపక్షముయొక్క సర్వాధికారమునకు లోబడియుండుట తటస్థించునని నేను నమ్మజాలను. రష్యా, జర్మని, ఇటలీ మున్నగుదేశములలో ఒక్కటేపక్షము నెలకొనియుండుటవలన ఆదేశాలలో ఒక్కపక్షమువారికే సర్వాధికారము ఏర్పడుట తటస్థించినది. కాని ఇతరపక్షములను నిషేధించవలసిన ఆవసరము నాకు కన్పించుటలేదు. జర్మనీలోని నాజీపక్షమువారు నియంతృత్వాధికారమే ఉత్తమమని స్వీకరించియున్నారు. అవిధముగా అన్నిదేశములలోను ఉండనక్కరలేదు. ప్రజాప్రాతినిధ్య పద్ధతుల ననుసరించి ఏపక్షమునకైనను దేశములో తావుండవచ్చును. ఈదేశములోని కాంగ్రెసుపక్షముగూడ ప్రజాప్రతినిధివర్గముగానే వ్యవహరించుచున్నది ఇతరపక్షములు ఈదేశములో కాంగ్రెసు పక్షమువలెనే వెలసియుండిన యెడల భారతదేశములో ఏకపక్ష సర్వాధికార ప్రభుత్వము ఎన్నటికిని ఏర్పడజాలదు. ప్రజాస్వామ్య పద్ధతులనే కాంగ్రెసుపక్షము సదా అనుసరించుచుండినయెడల కాంగ్రెసుపక్ష ప్రతినిధులు ప్రజలచే ఎన్నుకొనబడినవారుగానే యుందురు గాన నిరంకుశులు ప్రజల కధికారులైయుండజాలరు.

### పునర్నిర్మాణవిధానము

#### సామ్యవాదము

మనదేశమునకు సంబంధించిన ముఖ్యసమస్యలు అనగా ప్రజల దారిద్ర్యమును తొలగించుట, ప్రజలలో విద్యాభివృద్ధిని కలుగజేయుట, వ్యాధిబాధలను నివారించుట దేశములో సాధ్యమైనంతలను వస్తుసామగ్రిని, శాస్త్రపద్ధతుల ననుసరించి ఉత్పత్తిచేసి అన్నిప్రాంతములకును సక్రమముగా విభజించుట—ఈసమస్యలన్నియు సామ్యవాద మార్గముల ననుసరించియే చక్కగా నెరవేరవలసి యున్నవి, దేశ పునర్నిర్మాణమునకు జరుగవలసిన పనులన్నిటిని క్రోడీకరించి సాధనోపాయములను సూచించుటకై సమగ్ర విచారణ చేయుటకు రాబోవు జాతీయప్రభుత్వమువారు ఒక కమిటీని ముమ్ముందుగా ఏర్పరుపవలసియుండును. ఈ కమిటీ నిర్ణయింపవలసిన విధానములో రెండు ముఖ్యభాగములుండును. ఒకటి సద్యఃకార్యవిధానము, రెండవది దీర్ఘకార్య విధానము. మొదటచెప్పబడిన సద్యఃకార్యవిధానములో వెన్వెంటనే జరుగవలసిన పనులెట్టివో నిర్ణయింపబడవలెను. అట్టిపనులు మూడు ముఖ్యమైనవి గలవు (౧) దేశము ఆత్మత్యాగమునకై సిద్ధము చేయుట, (౨) భారతజాతినంతను ఏకీభవింపజేయుట, (౩) దేశమందలి వివిధ ప్రాంతములకును విశిష్ట సంస్కృతులకును సంపూర్ణ స్వాతంత్ర్యము కలుగజేయుట.

* * *

ఏవిదేశీయుల దండయాత్రమండి గాని మనము దేశమును కాపాడగలుగుటకై భారతజాతి నంతయును ఒక్కటిగా ఏకీభవింప చేయవలెను. ఒక్కగట్టి కేంద్రప్రభుత్వముచే ఆ ఏకత్వమును సాధించవలెను. కాని అల్పసంఖ్యా సంఘముల కన్నిటికిని, రాష్ట్రములకును విజ్ఞానమునందును, పరిపాలనయందును స్వాతంత్ర్య మొసగి స్వేచ్ఛనీయవలెను. మనల నందరను అణగద్రొక్కిడి విదేశీపాలనబరువు తొలగిపోయిన పిమ్మట. యీదేశములోని ప్రజల నందరను తిరిగి ఏకీభవింపజేయుటకు మనమెక్కువ కష్టపడవలసివచ్చును ఎందువల్లననగా స్వపరరాజుల ప్రభుత్వముక్రింద ప్రజలందరును కొంతవరకునిర్వీర్యులైరి. కట్టుబాటులేక చెదరిపోయి యున్నారు.

సామాన్యభాష సామాన్యలిపి

ఇట్టి జాతీయైకమత్యమును పురిగొల్పుటకు దేశమునకంతకును వర్తించెడి సామాన్యభాషయును సామాన్యలిపియును ఏర్పడి విస్తరింపవలెను. అంతియగాక, విమానములు, టెలిఫోనులు, రేడియోలు, ఫిల్ములు, టెలివిజనులు మున్నగు ఆధునిక యంత్రసాధనములవల్ల వివిధప్రాంతములవారికి సన్నిహిత సంపర్కమును కలుగజేయవలెను దేశమంతటను ఒక్కటే విధమగు విద్యావిధానమును వర్తింపజేయుటవల్ల ప్రజలందరియందును సమానభావ ప్రబోధమును కలుగజేయవలెను. సామాన్యభాషా విషయములో హిందీకిని ఉర్దూనకును కల్పింపబడిన భేదము కేవలము కృత్రిమమని నా యభిప్రాయము. ఈ రెండు భాషలయొక్క మిశ్రమమే చక్కని సామాన్యభాషగా ఏర్పడగలదని నా యభిప్రాయము. అటువంటి మిశ్రభాష యీ దేశములోని పెక్కు ప్రాంతములయందు మాట్లాడబడుచునే యున్నది ఈ సామాన్యభాషను నాగరిలిపిలో గాని ఉర్దూ లిపిలో గాని, వ్రాయవచ్చును కాని నామట్టుకునాకు మరొక యభిప్రాయము కలదు ప్రపంచములోని యితర రాజ్యాలతో సరిసమానముగా వ్యవహరింపగల్గుటకు తగినలిపిని మనము అవలంబించుట ప్రశస్తమైనపద్ధతి యని నాయభిమతము రోమను అక్షరమాలను (ఇంగ్లీషు వర్ణమాలను) మనము ప్రయోగించవలెనని నేను ఇచట నిచ్చెడియెడల మీలో చాలమంది నిశ్చ్వరపడిచూచెదరు. కాని, కేవలము శాస్త్రీయమైన హేతు వాదములతోను, చారిత్రిక పరిజ్ఞానముతోను నా సలహాను విమర్శింపగోరెదను . . . విదేశీయులిపిని మనము అనుసరించుట సహజజాతీయ వికాసము

(4వ పేజీ చూడుడు)





## మ. ఘ. వ. నైజాంస్టేటురైల్వే

### పూర్నా, జాల్నా, ఔరంగాబాదులమధ్య ఎక్కువ బండ్లు

23 ఫిబ్రవరి 1938 బుధవారమునుండి, పూర్నా, జాల్నామధ్య మూడవ తరగతి ప్రయాణీకులకై అదనముగా ప్యాసింజరుబండ్లు యీ క్రిందికాలములలో నడిపింపబడును.

| నెం. 54 షటిల్ | | గం.ని. | నెం. 53 షటిల్ | | గం.ని. |
|---|---|---|---|---|---|
| పూర్నా | పోక | 6 25 | జాల్నా | పోక | 15-57 |
| పర్భని | రాక | 7-21 | పర్భని | రాక | 1911 |
| | పోక | 7-29 | | పోక | 19-19 |
| జాల్నా | రాక | 11-07 | పూర్నా | రాక | 20-15 |

ఆదే తేదినుండియే జాల్నా, ఔరంగాబాదులమధ్య సెంటినెల్ స్టీమ్‌కోచ్ సర్వీసు యీ క్రిందికాలములలో నడపబడును.

| నెం. 56 సెంటినెల్‌కోచ్ | | గం.ని. | నెం. 55 సెంటినెల్‌కోచ్ | | గం.ని. |
|---|---|---|---|---|---|
| జాల్నా | పోక | 11-2((3 తరగతి) | ఔరంగాబాదు | పోక | 13-42 (3 తరగతి |
| ఔరంగాబాదు | రాక | 13-30 ,, | జాల్నా | రాక | 15-43 ,, |

స్టీంకోచ్ బండ్లలో స్త్రీలకు ప్రత్యేకస్థలము ఏర్పాటు చేయబడదు.

బై ఆర్డర్

చీఫ్ ట్రాన్స్‌పోర్టేషన్ సూపరింటెండెంటు

# గోలకొండపత్రిక

ఈశ్వర నామ సం॥ర మాఘ బ॥ ౧౦

గురువారము

## విద్యాశాఖకు ప్రభుత్వ సూచనలు

మ. ఘ. వ. నిజాం ప్రభుత్వము వారు విద్యాశాఖయొక్క ౧౩౪౫ ఫ, ౧౩౪౬ ఫ. పరిపాలనా నివేదికను విమర్శించి విద్యాశాఖయొక్క భవిష్యద్విధానము ఉండవలసిన పద్ధతినిగూర్చి కొన్ని ముఖ్యములగు సూచనలు జేసిరి. ఆసూచనలు ఒక సంవత్సరము ఆలస్యము తరువాత ఇపుడు ప్రకటించబడుచున్నవి. సాధారణముగా ఇట్టివి వెంటనే ప్రకటింపబడియుండినచో, ఆసూచనలనుగూర్చి ప్రజల అభిప్రాయమును ప్రభుత్వమువారు తెలిసికొనుటకు అవకాశము ఉండును. ఒక సంవత్సరమాలస్యముగ ప్రకటించుటవలన, అసూచనలలో ననేకములు గత సంవత్సరము లోగా అమలు జరిగియుండుటకు అవకాశముండును గనుక, ఇపుడు ప్రజాభిప్రాయ ప్రకటనము "దొంగలు జొరబడిన ఆరునెలలకు కుక్కలు మొఱిగిన ట్లుండును."

ప్రభుత్వ సూచనలలో ఎక్కువ భాగము ప్రాథమికవిద్యను గూర్చియున్నవి. ప్రాథమికపాఠశాలల సంఖ్యను వృద్ధిచేయుటయేగాక, ఆ పాఠశాలల యందు నేర్పబడు విద్యయు శ్రేష్ఠమైనదిగ నుండవలెననియు, ప్రాథమికవిద్యపై సెకండరీవిద్యపై ఖర్చుచేయబడు దానికంటె ఎక్కువ ఖర్చు చేయబడవలెననియు ఆసూచనలు కోరుచున్నవి. ౧౩౪౬ ఫ. ప్రారంభములో ప్రభుత్వమువారిచ్చే అంగీకరించబడిన మెకంజీ కమిటీ నివేదికలోకూడ ప్రాథమిక విద్యావ్యాప్తియొక్క అవసరము అంగీకరించబడి అందుకై అదనముగ ఖర్చు కూడసూచించబడియున్నది.

తర్వాత ప్రాథమిక విద్యనుసామాన్యజనుల దైనికసామాన్యావసరములకు చాలియుండునట్లు చేయవలసినదని ఒక సూచన చేయబడినది. దీనిచే ప్రతివాడును ప్రాథమికవిద్య ముగించు నప్పటికి లోకజ్ఞానముగలవాడై జీవనము గడపుకొన గలిగియుండునట్లు ప్రాథమికవిద్య నేర్పాటు చేయవలెనని భావమని మేమనుకొనుచున్నాము. అనగా ప్రాథమిక విద్యలో వృత్తివిద్యయు చేర్చబడవలసిన అవసర మంగీకరించబడినట్లైనది. అట్టిన ఈ ఉద్దేశ్యమును సాధించుటకు వార్ధాలో బ్రిటిషుఇండియా యందలి వివిధరాష్ట్రముల మంత్రులును చేరి ఆమోదించిన విద్యావిధానవిషయమైన తీర్మానము ఎక్కువ సహాయకారి గనుక మన ప్రాథమిక విద్యాశాఖవారు ఆ తీర్మానము నుకూడ దృష్టిలో నుంచుకొనదగును. కాని మెకంజీ కమిటీ వారు ప్రాథమికవిద్యయందు వృత్తి విద్యను కొద్దిగాచేర్చుటకు తీర్మానించి యుండుటవలన, మరల వార్ధావిధానమునుగూర్చి ఆలోచించుట జరుగునను కొనజాలము. కాని దేశమంతటనే గాక, మాకును ఆవార్ధావిధానము ఇంతవరకు తెలిసిన పద్ధతులన్నిటిలోను ఉత్తమమైనదిగ కనబడుచున్నది. "సబ్జక్టివ్ మెథడ్" అను పద్ధతికంటె, "ఆబ్జక్టివ్ మెథడ్" మంచిదను సిద్ధాంత మంగీకరించునపుడు వార్ధా విధానము యొక్క శ్రేష్ఠత్వము తెలియగలదు.

ఇంతవరకు బాగున్నది కాని, ఏపాఠశాలయొక్కగాని గ్రేడును హెచ్చించునపుడు ఆపాఠశాల భవనములు, ఉపకరణములు పైగ్రేడుకు తగినవిగ నుండునట్లు జాగ్రత్త వహించవలెనను హెచ్చరిక క్రింద విద్యావ్యాప్తికి ఆటంకము కలుగునని భయము కలుగుచున్నది. ఈ దేశము దరిద్రదేశము. మనకు లభించు భవనములతో, ప్రమాదముకాని భవనములు లభించనిచో ఆరుబయట చెట్లక్రింద నీడలయందో విద్య, లభించునట్టి కొద్ది ఉపకరణముల తోడ్పాటుతోనే, నిర్వహించుకొన వలసిన దేశమిది. లేనిచో విద్యలేకుండ ఊరక కూర్చుండ వలెనని అర్థమగును. ఏదియులేకుండ ఊరకుండుటకంటె దేశ దారిద్ర్యపరిస్థితులకు లోబడి ముందు అభివృద్ధికి తగిన పట్టుగొమ్మగ నుండగల ఏర్పాటు చేసికొనుటయే వివేకమగునని యాయభిప్రాయము.

ప్రభుత్వ సూచనలలోని తర్వాత ముఖ్యవిషయములు బాలికలకు తగిన విద్యావిధానమును సూచించ వలెనని విద్యాశాఖ కోరబడుటయు, చెవిటివారికిని మూగవారికిని ఒకబడిని, గ్రుడ్డివారికి ఒకబడిని మంచిపద్ధతులపై ఏర్పాటుచేయుటయు నైయున్నవి. బాలికలు పెద్దపెరిగిన తర్వాత మంచి గృహిణులుగ నుండుటకు తగిన విద్యావిధానమేర్పరచుట చాల అవసరము. చెవిటి, గ్రుడ్డి, మూగవారలుకూడ తమ జీవనమును మంచిగాను లోకమునకు ఉపయోగకరముగాను గడపునట్లు చేయుట ప్రతి నాగరక ప్రభుత్వముయొక్కయు విధియైయున్నది.

మొత్తముమీద ప్రభుత్వము వారి సూచనలు చాల ముఖ్యములైనవి. బాలికల విద్యవిషయమునను, గ్రుడ్డి, చెవిటి, మూగవారల విద్యఏర్పాట్ల విషయమునను, ప్రాథమిక విద్యావ్యాప్తి విషయమై ఇపుడు పనికి పూనకొనబడు చున్నట్లే, ఎంతవరకు ఆచరణ ప్రయత్నము జరిగినదియు ప్రజలు తెలిసికొన కుతూహలులై యుందురు.

## చిత్రనళీయము

సికిందరాబాదు రాజేశ్వరి టాకీసులో ౪ వారములనుండి "చిత్రనళీయము" జనులను ఆకర్షించుచున్నది. కలకత్తా యందు ప్రసిద్ధికెక్కిన నలచరితము తెలుగని వారందరు ఆకథను చెల్లూరు శ్రీరామాఫిలింసు లిమిటెడు వారు టాకీగ చేయించిరి.

ఈయూరైన చిత్రమందు దృశ్యములు (సీనరీ) చాల ఆకర్షణీయముగ నున్నవి. అడవి దృశ్యములలో పులుల పోట్లాటలు, ఏనుగులు, ఎలుగులు భీకరముగ నుండును. జలకేళిదృశ్యములు ఇతర దృశ్యములును బాగున్నవి.

ఇందలి వివిధ పాత్రలలో ప్రథమగణ్యమై దమయంతిపాత్ర సహజముగా నిర్వహింపబడినది. దమయంతికి నలునిపైగల ప్రేమను సూచించు సన్నివేశము, నలునికి జూదములో కలిగిన పరాజయమును వినినపుడు దమయంతికి కలిగిన మనస్తాపమును సూచించు సన్నివేశము అడవులలో నలదమయంతుల బాధలను గూర్చిన సన్నివేశములు— వీటికంతకు కలిగిన శోభకు దమయంతిపాత్రయే ఎక్కువకారణము

చిత్రములో నలదమయంతుల పాణిగ్రహణోత్సవమునకు బోవు సంరంభములో నున్న కుటుంబములలో సంభాషణలు మున్నగు ఘట్టములు హాస్య రసమును పోషించుచున్నది.

## షంషీరుగంజులో గోవధ

హిందూ ప్రజల సంచలనము

హైదరాబాదు ఫిబ్రవరి ౨౨

షాలిబండ ఆర్యసమాజ కార్యదర్శియగు శ్రీ ...రెడ్డిగారిట్లు తెలుపుచున్నారు:—

షంషీరుగంజులో బక్రీదు నాడు కొందరు మహమ్మదీయులు హిందూ వీథిలో గోవధ గావించుటచే హిందువులందు సంచలనము గలదు. ఈ విషయము పోలీసువారికి తెలుపబడినదనియు, వారు విచారణ దావించుచున్నారనియు తెలియుచున్నది

## శ్రీరాజా వేంకటరామారెడ్డి బహద్దర్‌గారి ఆగమనము

వారిరాక ఎవరికి తెలియకున్నను స్టేషనువద్ద గొప్ప గౌరవము

(స్వకీయ విలేఖరి)

హైదరాబాదు ౧౮ ఫిబ్రవరి.

అనారోగ్యముపై శ్రీ రాజాబహద్దరు వేంకటరామారెడ్డి ఓ.బి.ఇ. గారు మద్రాసునుండి ఒక మాసమునకు పైగా చికిత్సపొందుచుండిరి. ఇప్పుడిరు మిమ్ము పూర్తిగా ఆరోగ్యము కుదిరినది. నిన్న గురువారము సాయంత్రము ౩గంటలకు శ్రీవారు సికింద్రాబాదు స్టేషనులో దిగిరి. వారొనాడు వచ్చినది చాలామందికి తెలియదు ఒక్క బులెటిన్ పత్రికలో ౧౭ ఫిబ్రవరి నాడు వచ్చుచున్నారని తెలియుచున్నది అని మాత్రము వ్రాసియుండిరి. ఇట్లు చాలామందికి తెలియకున్నను రైలు స్టేషనులో సుమారు ౫౦౦మంది వారి ఆహ్వానార్థము వచ్చియుండిరి. సుమారు ౧౦౦ కోటోగ్రాఫులు వచ్చియుండెను. ఒకబండెడు పూలహారములు వారి మెడలో వేసివారిని గౌరవించినారు, ప్లాట్‌ఫారము నిలో ఒకచుటను చోటులేకుండా జనసమ్మర్దముండెను, సుల్తానుబజారు బాలికల ఉన్నత పాఠశాలకు చెందిన బాలికాదర్శినులు (Girl guides) ౨౦–౩౦మంది వచ్చియుండిరి. హిందువులు, ముసల్మానులు, రాజులు, లీడర్లు, అధికారులు, సుమాస్తాలు, ప్రొఫెసర్లు, పెద్దసాహుకార్లు చిన్నవారు పెద్దవారు, అన్నివిధములవారు అచ్చటికి విచ్చేసియుండిరి. కొందరు పకీర్లుకూడ వచ్చియుండిరి. ఒక్కమాసముమాత్రమే (అనారోగ్యము శ్రీవారు నగరాంతమువెళ్లగా వారిదర్శనార్థమును, వారి కారోగ్యము కలిగినదను ఆనందము ప్రకటించుటకున్న) ఇంతమంది ఎవ్వరికిని తెలియకున్నను అంతదూరము స్టేషనుకు పోయి గౌరవించివారన్న శ్రీవారియెడ హైదరాబాదు రాష్ట్రములో హిందువులందేకాక ముసల్మానులందేకాక సర్వమతములవారి యందును యొంతగానము ఎంత ప్రేమ, ఎంతభక్తి కలదో వెల్లడియగుచున్నది శ్రీవారు హైదరాబాదు రాష్ట్రమందంతటను అపూర్వవ్యక్తి. అద్వితీయ ప్రతిభావంతుడు:

శ్రీ రాజాబహద్దరు గారికి ఆరోగ్యము కలిగినందులకు సంతసించని రాష్ట్రీయుడే లేడని చెప్పవచ్చును.

శ్రీవారు మరొకమారు మొహర్రములో ౧౦ దినాలకుగాను మద్రాసుకు పోయివచ్చెదరని వినుచున్నాము.

## ఈసంవత్సరము కాంగ్రెసుమహాసభ విశేషాలు

౧. ఇది ౫౧వ కాంగ్రెసు. అందు చేత కాంగ్రెసు నగరానికి ౫౧ ద్వారాలు నిర్మించినారు.

౨. కాంగ్రెస్సు మహాసభాధ్యక్షులను ౨౦౦ ఏండ్లనాటి రథములో ఊరేగింపుచేసినారు.

౩. అరథాన్ని ౫౧ ఎద్దులకుగట్టిలాగించినారు.

౪. పోయిన సంవత్సరంవలె ఒకపల్లె గ్రామములో మహాసభ చేసినారు.

౫. కాంగ్రెసు నగరానికిపేరు విఠల్ నగర్ అనిపేరు పెట్టినారు. అవిఠల్‌నగర నిర్మాణానికి ఏడున్నరలక్షల రూపాయలు వ్యయమైనవి.

౬. కాంగ్రెసు అధ్యక్షులను శ్రీ సుభాషు చంద్రబోసు గారు సర్వ మహాసభాధ్యక్షులలో చిన్నవారు.

౭. ఆహ్వాన సంఘాధ్యక్షులైన శ్రీ దర్బార్ గోపాల్దాసుగారి ఉపన్యాసము ఈ ౫౧మహాసభలలోజరిగిన అహ్వాన సంఘాధ్యక్షులయొక్కయు, అధ్యక్షులయొక్కయు ఉపన్యాసము లన్నింటిలోను చాల చిన్నదైనట్టి ఉపన్యాసము, అనగా ౩,౪ నిముషాలుపట్టు ఉపన్యాసమే

౮. కాంగ్రెసు వైభవము చూచుటకు వచ్చిన జనులసంఖ్య దాదాపు మూడు లక్షలు.

౯. పవిత్ర నదులలో తపతీనదము చాల పవిత్రమైనది. ఇప్పుడు దాని తీరమందే మహాసభ జరుగుటచే ఆ నద మింకను పవిత్రమై పోయినది

౧౦. ౫౧ లక్షల పదాలు ... రు కేబుల్ గ్రాఫుల ద్వారా పంపబడినవి

## షాపురములో మద్యపాన వర్జనము

(గోలకొండ విలేఖరి

ఖల్లాపాపడన ఫిబ్రవరి ౨౨

ఈమధ్య జరిగిన ప్రచారఫలితముగా గ్రామమునందు అంతటను, హరిజనులందు సంపూర్ణముగను —వీరిసంఖ్య ౧౦౦౦ వరకుగలదు. మద్యపానము మానివేయబడినది. గ్రామములు తాగుచుండు మద్యమును గ్రోలినందులకు విచారమును తెలుపుచు, ముందు దురభ్యాసమును సంపూర్ణముగా త్యజించెదమని ప్రతినబూనిరి.

## మద్యపాననిషేధము విజయవంతమైనది

ఈగ్రామమువారికి విద్యగిట్టదట!

ఎక్కడచూచినను పెంటకుప్పలే

బొందుగుల జాగీరులో విచిత్రపరిస్థితులు

(స్వకీయ విలేఖరి)

బొందుగుల జాగీరు

బొందుగుల జాగీరు నవాబ్ ...యారజంగు బహద్దురుగారి జాగీరు, ఇది ఇటీవల ప్రసిద్ధిగాంచుచున్న కొలనుపాకకు ౭ మైళ్లదూరములోనున్నది. ఈగ్రామములో సుమారు ౫౦౦ ఇండ్లును, ౨౦౦౦ జనులును కలరు. సుమారు ౨౫ ముసల్మానులఇండ్లు కలవు ఈగ్రామములో హిందువులు, ముసల్మానులును అన్యోన్య ప్రేమతో నున్నారు.

పారిశుద్ధ్యము

గ్రామములోమాత్రము ఏవిధమైన పరిశుభ్రత యుండదు. ఇండ్లముందు ఇండ్లచుట్టు ఎటుచూచినను పెంటలు ఎటుచూచినను మురికిదిబ్బలే. దీనివలన గ్రామములకు రెండువిధాల నష్టము. గ్రామపారిశుద్ధ్యములేక జనులు రోగపీడితులగుటయు, ఎరువులు పొలములోవేయక భూములు నిస్సారమగుటయు సంభవించును

వ్యవసాయ పరిస్థితులు

విచారించియాడగా గ్రామము వ్యవసాయము కూడ సంగా చెయ్యరని తెలిసినది మరియు ఈ సంవత్సరము తొమ్ముదచ్చినను అమూదము చేలు పూర్తిగా బొందుపోయినను జనులుతమ జాగీరాదులతో పన్నుగ ఫీవిషయమై మొరపెట్టుకొనలేదని తెలిసినది,

విద్య సున్న

ఈ గ్రామములో ఇంకొక విపరీతము కనబడినది. ఇంతపెద్ద గ్రామానికి జాగీరుపక్షమున ఒక్క ప్రాథమిక పాఠశాలయైనను ఏర్పాటుచేయలేదు. గ్రామములకుకూడా విద్యఅంటే గిట్టకపోవుట, గ్రామములో ప్రజాహిత చింతకులలో ముఖ్యులైన నారాయణరెడ్డిగారు మన్నగువారు ఒక పాఠశాల నేర్పాటుచేయించగా మాకు చదువుగిట్టదు అనిచెప్పి గ్రామస్థులలో కొందరు అబడిని మూసివేయించిరట! ఇది చిత్రముగా ఉన్నది,

మద్యపాననిషేధప్రచారము

గత శుక్రవారము అనగా ౧౦ దినాలక్రిందట ఈగ్రామానికి ఒక పెద్దబస్సులో హైదరాబాదు నగరమునుండి కొందరు ముఖ్యులువిచ్చేసియుండిరి. అందు ముగ్గురు స్త్రీలు (శ్రీమతులు కంటె వెంకటరమణమ్మగారు ఉన్నవ సుగుణమ్మగారు కొలనుపాక రామచంద్రారెడ్డిగారి సతీమణియు) విచ్చేసియుండిరి. సాయంత్రము ౪ గంటలనుండి రాత్రి ౭ గంటలవరకు సభ జరిగెను; సుమారు ౫–౬ వందలమంది వచ్చియుండిరి. ఉన్నవ వెంకటరామయ్యగారున్ను సురవరం ప్రతాపరెడ్డిగారున్ను, ఆళ్వారుస్వామిగారున్ను, బి. యల్. శర్మగారున్ను, సి. యన్. నాయుడు గారున్ను, భాజంనరిసింలు గారున్ను, గోవిందరెడ్డిగారున్ను, మందుముల రామచంద్రరావుగారున్ను శ్రీమతి సుగుణబాయిగారున్ను, శ్రీమతి కంటె వెంకటరమణమ్మగారున్ను మద్యపాన దురభ్యాసమువల్ల నష్టములను బాగుగా వివరించిరి. కొలనుపాకనుండి మరియు చుట్టుపట్టు గ్రామములనుండియు చాలమంది వచ్చియుండిరి. బొందుగుల గ్రామముఖ్యులగు శ్రీయుత నారాయణరెడ్డి గారిని ముఖ్యముగా అభినందించవలసియుండును. వారిమూలమునసే ఈప్రాంతాలలో మంచి ప్రబోధము కలుగుచున్నది.

## ఉస్మానియా ఆంధ్రభాషా నిలయము

(గోలకొండ విలేఖరి)

కరీంనగరు ఫిబ్రవరి ౨౩

సుమారు ౨౦ సంవత్సరముల క్రితము స్థాపింపబడిన ఉస్మానియా ఆంధ్రభాషానిలయము కొంతకాలము పౌరుల ఆదరణాభిమానములులేక ఎక్కువ అభివృద్ధి పొందలేకున్నను ప్రస్తుతము మొదటిదరగతి అనగా మాసమునకు ఒక రూపాయి చెల్లించు చందాదారులు ఎనిమిది మందియును, అర్ధరూపాయి చెల్లించు (రెండవ తరగతి) చందాదారులు ౩౨ మందియును గలరు. ఈ నిలయమునకు ఆంధ్ర దినపత్రికయున్ను కృష్ణాపత్రికయున్ను, గోలకొండయున్ను వచ్చుచున్నవి. శ్రీ గజాననశర్మగారు "భక్తి ప్రబోధిని" అను మాసపత్రికను ఉచితముగా యిచ్చుచున్నారు. నిలయము శిథిలావస్థలో యున్నది. ఈ నిలయమునందున్న ౪౦౦ పుస్తకములు గ౦వు పాలకవర్గమువారు దీక్షతో శ్రద్ధతో పనిచేసిన త్వరలోనే గ్రంథాలయము ఉన్నతస్థితికి రాగలదు.

విత౦తువివాహ

మామోదించ బడినందుకు

## సనాతనధర్మప్రచారకమండలి కృతజ్ఞత!

బహిరంగసభ జరుపుటకై యత్నము

(స్వకీయ విలేఖరి)

ఖమ్మము ౧౧–౫–౪౭

సనాతన వైదికధర్మ ప్రచారకమండలి (ఖమ్మం)పక్షమున మ. ఘ. వ. నిజాంప్రభువారిక్కుడు హిందూవితంతు వివాహశాసనము అంగీకరించినందులకు ౨౩–౫–౪౭ తేదిన ఖమ్మం మెట్టులో కృతజ్ఞతాపూర్వక వందనము లాచరించుటకై ఒక బహిరంగసభ సమావేశపరచి, గస్తినిషాన్ ౫౩ ననుసరించి ఆ వ్వలుకాలుకొరు అనుజ్ఞ కోరబడినది. ఈ మహాసభకు, రా. నందిరాజా రామకోటేశ్వరరావుగారిని అధ్యక్షులుగా నుండుటకు కోరిరి.

## నిజామాబాదు హర్తాలు ముగింపు

## పోలీసు మొహతెమీంగారి ప్రబోధము

(గోలకొండ విలేఖరి)

నిజామాబాదు ఫిబ్రవరి ౧౭

బక్రీదుపండుగ సందర్భమున కచ్చీమసీదులో గోవధగావింపబడుటచే నిజామాబాదు పురహిందువులు ౧౨వ తేదినుండి ౧౪వ తేదివరకు సంపూర్ణహర్తాళమును జరిపిరి. ఉభయపక్షముల ప్రముఖులు సమాధాన ప్రయత్నములను మొదటినుండియు గావించుచునేయుండిరి. ౧౪వ తేదినాడు ధర్మశాలయందు జరిగిన హిందూపౌరుల సమావేశమునకు పోలీసు మొహతెమీం, దువ్వంతాలుక్దారు, తహసీల్దారుగారలు వచ్చిరి. పోలీసు మొహతెమీంగారు సమావేశమునందుపన్యసించుచు ఈప్రమాదము జరిగినందులకు తమ విచారమును ప్రకటించుచు ముందిట్టిప్రమాదములు జరుగకుండ చర్యగైకొనబడుననియు, మొదటనే ఆమీనుగారు సరియగు శ్రద్ధగైకొని న పరిస్థితులీస్వరూపమును దాల్చియుండెడివి కావని తెలిపి హర్తాళమును మానుటకై కోరిరి. మొహతెమీంగారు తమ ఉపన్యాసమును ముగించుచు తాము ప్రజాసేవకులమనియు, ప్రజాశ్రేయమునకై నిరంతరము తాము ప్రయత్నింతుమనియు ప్రబోధించుటవలన హిందువులు హర్తాళమును మానుకొనిరి. ఉభయపక్షీయులును సంతసమును ప్రకటించుచున్నారు.

## ఆంధ్రమహాసభాధ్యక్షుని నిజామాబాదు పర్యటనము

(గోలకొండ విలేఖరి]

నిజామాబాదు ఫిబ్రవరి ౧౭

నిజాంరాష్ట్రాంధ్ర మహాసభాధ్యక్షులగు శ్రీ మందుముల నరసింగరావుగారు, శ్రీ కొండా వెంకట రంగారెడ్డిగారితోపాటు ఈనెల ౧౧వ తేదీనుండి ౧౫వ తేదీవరకు నిజామాబాదు జిల్లాలో పర్యటనము గావించిరి. పర్యటనసందర్భమున అధ్యక్షులవారు గ్రామప్రజల పరిస్థితులను, వారి యిబ్బందులను విచారించి, నివారణకై తగువిధానములను సూచించిరి గ్రామప్రజలు అధ్యక్షులకు నిజాంసాగరు కొలువక్రిందిభూములందు తమకు కలుగుచున్న నష్టములను విన్నవించుకొనగా సానుభూతి ప్రకటించిరి.

అధ్యక్షులవారు గ్రామప్రజలు కొసగిన సందేశములందు విద్యా, వ్యవసాయ, ఆర్థిక విషయములందు అభివృద్ధినొందుటకు అవసర విధానములను సూచించిరి.

శ్రీ నరసింగరావుగారు ఇచట ౧౫వ తేదినాడు శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారి అధ్యక్షతక్రింద సమావేశమైన శ్రీ ప్రతాపరుద్ర గ్రంథాలయ వార్షికోత్సవమునందు పాల్గొని పరివార సహితముగా హైదరాబాదు కేగిరి.

## ప్రయాగ రాష్ట్రములో క్రొత్తమంత్రులను పర్వబచరు

చధారీ నవాబుగారి ప్రకటన

న్యూఢిల్లీ ఫిబ్రవరి ౧౭

చధారీ నవాబుగారు నేడు ముఖ్యాజ్ఞను యిచ్చుటకై వచ్చిరి.

ప్రయాగరాష్ట్రమందు తాత్కాలిక మంత్రివర్గము నేర్పరచు విషయమై గవర్నరు తనతో సంప్రతింపులు జరిపెననియు, కాని అట్టి తాత్కాలిక మంత్రివర్గము నేర్పరచు సూచనయేమియు అగపడలేదనియు నవాబుగారు తెలియజేసిరి.

రాజ్యాంగ విధానము రద్దయిన పక్షమున నవాబుగారు గవర్నరు సలహాదారుగ నుండగలరని పుకారులు పడలినవి. ఈ విషయము నవాబుగారినడుగగా దీనినిగురించి ప్రస్తావనయే రాలేదనిరి.

## బృహస్పతీయుల సమావేశము

## నాయకుల ఉద్బోధ

హైదరాబాదు ఫిబ్రవరి ౨౦

గత ఆదివారమునాడు నగరమునందలి ౧౪ పురముల బృహస్పతీయుల (సెట్టు) సమావేశము జాంబాగు దేవాలయమునందు జరిగినది. సుమారు ౫౦౦ బృహస్పతీయులు సమావేశమునందు పాల్గొనిరి.

సమావేశమునందు శ్రీ మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణారావు, సురవరం ప్రతాపరెడ్డి, కృష్ణస్వామి ముదిరాజ, బాజం నరసింలు ప్రభృతు లుపన్యసించుచు బృహస్పతీయులు విద్యా, నైతిక, ఆర్థికవిషయములలో అభివృద్ధిగాంచుటకు, వారిని దురాచారములనుండి తప్పించుటకు బృహస్పతీయ సంఘమును స్థాపించుటవసరమని సూచించిరి.

సమావేశమునందు మద్యపానము మానవలెను, బాల, బాలికలను పాఠశాలలకు పంపవలెను అను రెండుతీర్మానములు ఆమోదింపబడెను.

## అధ్యక్షోపన్యాసము

[౫వ పేజీ తరువాయి]

ఇరుగుపొరుగు రాజ్యములతో సంబంధము

మన యిరుగుపొరుగు రాజ్యములగు పర్షియా ఆఫ్గనిస్థాన్, నేపాళము, చీనా, బర్మా, సయాము, మలయా, ఈస్టిండీసు, సింహళములతో వైజ్ఞానిక సంబంధములను మనము పెంపొందించుకొనవలెను. వారి విషయమై మనకును మనవిషయమై వారికిని యెక్కువగా తెలిసియుండుటవసరము.

... ... ...

ముగింపు

నేడు మనమొకమహావిషమస్థితి నెదుర్కొనుచున్నాము. కాంగ్రెసులోపల కతిపయ పక్షములకు విభేదములు కలవు. ఈవిషయమును మనము గమనింపకుండనుండజాలము. వెలుపల బ్రిటిషుసామ్రాజ్యతత్వము నెదుర్కొని పోరాడవలసినదిగ నేర్పడియున్నది. ఈ విషమసంధులలో మనమేమి చేయుదగును? మనల నెదుర్కొను కష్టముల నన్నిటిని ఏకమత్యముతో నెదుర్కొనవలసి యున్నదని నేను వేరుగా చెప్పుటవసరమా? కాంగ్రెసును ప్రజాప్రతినిధి సంస్థగా చేయుటకును, సామ్రాజ్యతత్వమును ప్రతిఘటించి పోరునందరికిని అందు తావు కల్పించుటకును ఎడమపక్షమువారు తమ సర్వశక్తులను వినియోగించెదరు గాక యని నేను వారికి విజ్ఞాపనము గావించుచున్నాను.

... ... ...

మహాత్మునికి భగవంతుడు

ఆయుష్యము ప్రసాదించుగాక

ఇంకను అనేకసంవత్సరములవరకు భగవంతుడు గాంధీ మహాత్మునికి ఆయుష్యము ప్రసాదించుగాక యని కోరుచు నేను ఉపన్యాసము పూర్తిచేయుచున్నాను. భారతదేశము మహాత్మునికోల్పోవజాలదు. ముఖ్యముగా ఈసమయమున వారినికోల్పోజాలము. మనపోరాటమునందు ద్వేషము, క్రోధము లేకుండచేయుటకు అయన అవసరము. భారత స్వాతంత్ర్యపోరాటము ఫలప్రదమగుటకు ఆయన అవసరము. మానవకోటి కల్యాణమునకై ఆయన అవసరము. మన పోరాటము ఒక్క బ్రిటిషు సామ్రాజ్యతత్వమునకు ప్రతికూలముగామాత్రమే కాదు. ప్రపంచమునందు సామ్రాజ్యకాంక్ష గల దేశములన్నిటిని మనము ప్రతిఘటించి పోరుచున్నాము ప్రపంచమునందలి సామ్రాజ్యముల కన్నిటికిని బ్రిటిషు సామ్రాజ్యమే మూలాధారము. కావున మనము భారతదేశ క్షేమమునకు మాత్రమే గాక మానవకోటి క్షేమమునకంతటికిని పోరాడుచున్నాము దాస్యబంధమునుండి భారతదేశము విముక్తియగుచో ప్రపంచమంతయు రక్షింపబడినదగును.

వందేమాతరమ్.

# అధ్యక్షోపన్యాసము

[౫వ పేజీ తరువాయి]

నకు ప్రతిబంధకముగా నుండునని నేనొకప్పుడు భావించుచుండెడువాడను. కాని, నేను ౧౯౩౫వ సం॥ లో టర్కీ దేశమునకు వెళ్లినప్పుడు నా అభిప్రాయము మారిపోయెను. ప్రపంచములోని ఇతరరాజ్యాలవారితో పాటుగా మనము కూడ వారి లిపినే వాడుచుండినయెడల ఎంతలాభము పొందగలమో గ్రహించితిని. మనదేశములోని, జనసామాన్యములో నూటికి ౯౦ మంది నిరక్షరులుగానే యున్నారు. వారు ఏలిపియును నేర్చియుండలేదు. కనుక వారికి నూతనాక్షరాభ్యాసమును చేయునప్పుడు, వారికి ఏలిపిలో విద్య ప్రారంభించినను వారికి అభ్యంతరముండదు. ఇంగ్లీషు అక్షరములను వారు నేర్చుకొనేయడల, ఏ యూరోపియను భాషనైనను కూడ వారు సులభముగా నేర్వగల్గుదురు.

* * *

జాతీయ పునర్నిర్మాణమునందు
దీర్ఘ విధానము
జనసంఖ్యావృద్ధి నిగ్రహము

దీర్ఘ విధానమునందు ముఖ్యముగా చర్చింపదలచిన సమస్య యొకటికలదు. అదేమనగా జనసంఖ్యాభివృద్ధి భారత దేశమునందిప్పుడు మితిమీరిన జనసంఖ్యయున్నదా లేదా యనుశాస్త్రచర్చనే నిప్పుడు చేయబూనుటలేదు. కాని, ఒక్క విషయమును మాత్రము చెప్పదలంచితిని. దారిద్ర్యము, దుర్భిక్షము, వ్యాధులు ప్రబలియున్న ప్రాంతములలో జనసంఖ్య మితిమీరిపోవుచుండుట ఎంతమాత్రమును కూడదు. ఒక్కదశాబ్దములో ౩౦ కోట్ల జనసంఖ్య యీ దేశములో వృద్ధియగుచుండెడల మనము భరింపజాలము. గత సంవత్సరములలో వలెనే, మనదేశ జనసంఖ్య నాయకేక మహోవేగముతో వృద్ధి చెందుచుండునెడల, మనము తలపెట్టిన దేశాభ్యుదయ కార్యములు వ్యర్థ ప్రయత్నములగును. కనుక, మనము అన్నవస్త్రములిచ్చి చదువుసంధ్యలు నేర్పి పోషింపగలిగినంతవరకే జనసంఖ్యాభివృద్ధిని కోరవలెను. అంతకుమించిన జనసంఖ్యా వృద్ధికాకుండ నిగ్రహింపవలెను.

ఆర్థిక పునర్నిర్మాణము
ఫాక్టరీలు; గృహపరిశ్రమలు

జాతీయ పునర్నిర్మాణ విధానములో ముఖ్యమైనది దేశదారిద్ర్యవిమోచనము. ప్రజల దారిద్ర్యమును తొలగించుటకు మన భూసాగుపద్ధతులను మార్చుచేయవలెను. జమీందారీ పద్ధతినిమార్చవలెను. వ్యవసాయకుల ఋణభారమును తొలగించవలెను. గ్రామవాసులకు తక్కువ వడ్డీలకు అప్పులను లభింపజేయవలెను. సహకార సంఘములను విస్తరింపజేసినయెడల, ఉత్పత్తిదారులకును, అమ్మకదారులకును కూడ అసంఖ్యాకమైన సహాయము కలుగును. వ్యవసాయమువలన ఎక్కువలాభము లభించుటకు దానిని శాస్త్రీయమైన రసాయన పద్ధతులతో సాగింపవలెను.

ఆర్థిక దైన్యమును తొలగించుటకు వ్యవసాయాభివృద్ధి చాలదు. దేశములోని పరిశ్రమలను వృద్ధిచేయుట కొక సర్వసమగ్రమైన ప్రణాళికను తయారుచేయవలెను. పరిశ్రమలకు ప్రభుత్వము సాయ యజమానులై యుండవలెను. పరిశ్రమలు ప్రభుత్వముయొక్క ఆధ్వర్యములో నుండవలెను. ఇతరదేశాలలో అపారమైన వస్తూత్పత్తి యంత్రాగారములలో తయారై మనకు దిగుమతియగుచుండుటవల్లను: మన దేశీయపరిశ్ర

[౫వ పేజీ చూడుడు]

The only Leading National *Bi-weekly* of the Andhra Provinces.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

GOLKONDA
The only out-standing effective medium for the ventilation of views and grievances of 70,00,000 Andhras of the Premier State

Volume 12 | HYDERABAD-DECCAN | Number 82

**Thursday 24 th February 1938**

## అభివృద్ధిపక్ష సభ్యులందరికి మనవి

### మద్యపాన నిరోధక దినము

శోదర పక్షీయులారా!

హైదరాబాదు నగరములో కొంత కాలము నుండి ప్రభుత్వమువారు మద్యపాన నిరోధక సంఘమును నవాబ్ మిర్జాయార్ జంగు బహద్దరుగారి యాజమాన్యములో స్థాపించి దేశములో ప్రచారము చేయుచుండినది చాలమంది యెరిగియున్నారు. మరియు మ. ఘ. శ. నిజాం ప్రభువుగారు తమ రజతోత్సవ సందర్భమున మద్యపానము సాధ్యమైనంతవరకు తగ్గించవలెనని సెలవిచ్చియుండినది ప్రజలింకను మరవలేదు.

మద్యపాన నిరోధక సంఘమువారు ఇటీవల రాష్ట్రమందంతటను "మద్యపాన నిరోధక దినము"ను ఏర్పాటుచేసి ఉత్సవము చేసి దేశీయులలో మత్తుపదార్థములవలని నష్టములను గురించి ప్రబోధము కావింపనున్నారు. ఈ సందర్భమును పురస్కరించుకొని మేము (ఫిబ్రవరి వాడు) ౧౫ దినాల కిందట మద్య నిరోధక సంఘాధ్యక్షులకు మన పక్షమువారు తెలుగు జిల్లాలలో ప్రబోధముచేసి సహకారము చేయుటకు సంసిద్ధులుగా నున్నారనియు, నిర్ణీత దినమున మద్యపాన నిరోధముతప్ప యితర ప్రచారమేదియు కావింపబడదనియు తెలుపుకొనియుంటిని. అందుపై వారిట్లు జవాబిచ్చినారు.

"ఫిబ్రవరి ౧౯౩౮ నాటి సంఖ్యగల మీ లేఖందినది. కృతజ్ఞులము. మద్యపాన నిరోధ దిన కార్యక్రమము కను సిద్ధముకాలేదు. వివరములు తయారైనవెంటనే యొకప్రతి తమకు, అవసర కార్య మారంభించుటకు తగియు సమయముండునటుల, పంపబడును.........."

మరికొను పై సంఘమువారు నవాబు మిర్జాయార్ జంగు బహాదరుగారి ప్రకటనలను కొన్ని పంపినారు. ఆ ప్రకటనను గత గోలకొండ సంచికలో ప్రకటింపజేసినది మీరు గమనించియే యుందురు.

ఇప్పుడు మీయందరితో మనవిచేయుట యేమన మీమీ ప్రాంతములలో మీరు మాఘ బ॥ ౩౦లు నాడు మద్యపాన నిరోధ ప్రచారమును విరివిగా గావించి దేశీయులలో ప్రబోధము గావింపగలరు. "తెలంగాణావారైతు మిక్కుటమైన త్రాగుబోతు"అను అపఖ్యాతికి వచ్చియున్నారు. కాని దరిద్రమువలనే దు ఈ దురాచారముకూడ తెన్నంటియున్నది. మన ప్రభుత్వమువారు చేయు ఈ సత్కార్యములో మీరందరును ఉత్సాహముతో పాల్గొని తోడ్పడుదురని మనవి చేసుకొనుచున్నాను. ప్రభుత్వ మద్యపాన నిరోధక సంఘమువారికి—తమ ప్రచురములను కార్యక్రమమును పంపుమని వ్రాసినాను. అవి వచ్చినచో మీ కందరికిని పంపుకొందును.

మన పక్షసభ్యులు తాము చేసిన పనియొక్క వివరములు మాఘ బ॥ ౩౦ ల తరువాత వారము దినములలోగా ఈ కార్యాలయమునకు పంపగలరు.

బి ౧౯౦౯ త్రూపుబజారు, హైదరాబాదు.

ఇట్లు
సురవరము ప్రతాపరెడ్డి.
అభివృద్ధిపక్ష—అధ్యక్షుడు.
౧౫-౨-౩౮ ఫ.

---

## దేవాలయాలమధ్య ఈదుగానిర్మాణయత్నము

### తాలుక్దారుగారికి మంథెనహిందువులవిన్నపము

(గోలకొండ విలేఖరి)

మంథెన: ఫిబ్రవరి ౨౨

స్థానికమహమ్మదీయులు నమాజు చదువుకొనుటకొరకై ఈదుగా శిథిలమై పోయినందున క్రొత్త ఈదుగా నిర్మించుటకై అనుమతి నొసగవలసినదని దువ్వం తాలుక్దారుగారికి చేసిన విజ్ఞప్తి ఫలితముగా, మహావాది రాఘాకృష్ణస్వామిని తహసీల్దారుగారు రప్పించి ఈదు

## క్రొత్త కాంగ్రెసు కార్యకారిణి సంఘము

సర్దార్ వల్లభాయి పటేలు

ఖాన్ అబ్దుల్ గఫారు ఖాన్

సరోజిని నాయుడు

బూలాభాయి దేశాయి

డాక్టర్ పట్టాభి సీతారామయ్య

## శ్రీరాజా వేంకటరామారెడ్డి బహద్దర్ గారికభివందనము

### సుల్తానుబజారుబాలికల ఉన్నతపాఠశాల సమావేశము

హైదరాబాదు ఫిబ్రవరి ౧౯

నేడు సాయంకాలము శ్రీరాజాబహద్దరు వేంకటరామారెడ్డి ఓ బి ఇ. గారు (పైపాఠశాలాధ్యక్షులు) సంపూర్ణారోగ్యము గలిగి మద్రాసునుండి సుఖముగవిచ్చేసిన సందర్భమున వారి నభినందింప విద్యార్థినీ సంఘము, ఉపాధ్యాయ సంఘము శ్రీయుత కొండా వేంకటరంగారెడ్డిగారి (హైకోర్టువకీలు, పాఠశాలాధికార సంఘ సభ్యులు) యధ్యక్షతక్రింద రెడ్డిబాలికల వసతిగృహ తోరణమునకు సమావేశమైరి. పలువురు

సుభాసు చంద్రబోసుగారు క్రొత్త కాంగ్రెసు కార్య కారిణీ సంఘమునందు ఈ క్రింది వారిని పెట్టుకొనినారు.

౧. సుభాసు చంద్రబోసు (అధ్యక్షుడు)
౨. పండిత జవహర్లాల్ నెహ్రూ
౩. మౌలానా అబ్దుల్ కలాం ఆజాద్
౪. సేట్ జమ్నాలాల్ బజాజు (కోశాధ్యక్షుడు)
౫. జయరాందాస్ దౌలత్ రాం
౬. శరత్ చంద్రబోసు
౭. బూలాభాయి దేశాయి
౮. హరేకృష్ణ మెహతబ్
౯. డాక్టర్ పట్టాభి సీతారామయ్య
౧౦. ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్
౧౧. ఆచార్య కృపాళిని (జనరల్ సెక్రెటరీ)
౧౨. బాబూ రాజేంద్ర ప్రసాద్
౧౩. సరోజిని నాయుడు
౧౪. సర్దారు వల్లభాయి పటేలు

సుభాస్ చంద్రబోసు

పండిత జవహర్లాల్ నెహ్రూ

బాబూ రాజేంద్రప్రసాద్

పురప్రముఖులుకూడ విచ్చేసిరి. రాజాబహద్దరుగారు మందిరప్రవేశ ద్వారమునకు విచ్చేయగనే బాలికలు మంగళహారతులతో, మంగళగీతికలతో నెదురేగి మంగళాక్షతలు జల్లి తిలకమిడి పుష్పమాలికతో స్వాగత మొసంగిరి.

జయ జయధ్వానములు శెలరేగ రెడ్డిగారు పవిష్టులైనపిదప శ్రీమాన్. వి. హెచ్. రంగాచార్యులుగారు "ప్రశంసా శ్లోకముల" జదివిరి. బాలికలు కఱ్ఱ కత్తిసాములు, జేసి సభికుల మెప్పువడిసిరి. బాలికా సంఘమువారు కఱ్ఱ, కత్తిసాములలో నుత్తమప్రదర్శనము చేసిన చిరంజీవిని భాగ్యసుజాతయను విద్యార్థినికి రజత పతకముతో బహూకరించిరి.

పద్య పఠనములో నుత్తమశ్రేణిలో వచ్చిన విద్యార్థినులు ఏ. జయలక్ష్మి, వి. రాజేశ్వరి గాజామణి, జయ, అన్నపూర్ణలకును, పాఠశాలలో మర్తమబాలికగా నెన్నకొనబడిన ఆర్. లలితకును, అక్షర పూరణము పోటీలో నెగ్గిన కె అనసూయ, యం. శకుంతలలకును బహుమానము లీయబడెను.

అధ్యక్షులు రాజాబహద్దరుగారి పవిత్రజీవితము నుగ్గడించిరి. తుదకు రాజాబహద్దరు వారుపన్యసించి తమ తా మద్రాసున నున్నపుడు ... స్త్రీ ... దిలకించితిమనియు మనముకూడ ... స్త్రీ విద్యా విషయమున ముందంజ వేయగలయుమనియు చెప్పి తమకీ వాడిట్లు సత్కరించి నందులకు కృతజ్ఞత దెలిపిరి. మంగళముతో కార్య క్రమము ముగిసెను.

కాలొరకై వారిచేతు గైకొనుటకు నిశ్చయింపబడినదనియు, అందుచే వారు ఆభూమికి రాజీనామా నొసగిన పరియగు మూల్య మొసగబడునియు తెలిపినవార్త వ్యాపించినందున గ్రామహిందూవాసులందు అధిక సంచలనము చెలరేగియున్నది.

ఈగ్రామము గోదావరీతీరమున నుండిన ప్రాచీన బ్రాహ్మణ నివాసము. గ్రామమున ఉత్తరదిశలో సుమారొక మైలుదూరమునందు గోదావరి నది ప్రవహించును. గ్రామమునకు, గోదావరికి మధ్యప్రదేశమునందు ఓంకారేశ్వర అంజనేయు గోడిలింగ, భాగీరథి, వినాయక, కాలభైరవ వీరభద్ర, దత్తాత్రేయమందిరములును, మరికొన్ని పూజావిగ్రహములును గలవు. నదీతీరమున గౌతమేశ్వర, శ్రీరామ, సరస్వతి, సావిత్ర్యాలయములుగలవు. గ్రామహిందువులు నిత్యమును గోదావరిలో స్నానముచేసి విగ్రహపూజ గావింతురు. ముఖ్యముగా వైశాఖ, ఆషాఢ, శ్రావణ, కార్తీక, మాఘమాసములందును, ఇతర పర్వదినములందును వేలకొలది స్త్రీపురుషులు పూజా పునస్కారములు గావించి సేవలు తీసెదరు.

తహసీల్దారుగారు సూచించిన ప్రదేశము ఈబాటలో వేరలదు. అందుచే ఈదుగా ఇచట నిర్మించుటవలన హిందూ మతోత్సవముల కాటంకము కలుగునని వారు భీతిల్లుచున్నారు. ఇంతేగాక ఈప్రదేశము గ్రామజనుల నివాసము కొరకు ప్రత్యేకింపబడియున్నదనియు, ప్రత్యేకముగా మహమ్మదీయుల గృహములకొరకొసగబడియున్నదనియు, తెలియుటచే హిందువుల ఆందోళన మరింత అధికమగుచున్నది.

అందుచే హిందువులు గ్రామ ఉత్తరదిశయందు ఈదుగా నిర్మింపకూడదనియు, నివాసగృహములకు ఈప్రదేశము ప్రత్యేకించకూడదనియు కోరుచు హిందువులు తాలుక్దారుగారికి విన్నవించుకొనిరి.

---

### ప్రశంసా పద్యరత్నమాలిక

త్వం బద్ధస్థభువనస్య సత్య మథవా
కిం రోగ రాహుగ్రహో
గృహీత్వాం పున నామ ముగ్ధ మనసా
లోక శోభాకరం
దైవాత్త్వం ఖలు రాజసేగ్రహముఖా
న్మిత్రోయథా భాస్కరః
ఏతే ఫుల్ల హృదయ్యుజా విదధతే
తే స్వాగతం స్వీకురు. ౧

లోకస్ఫార యశఃకృపామృతధునీం
బిభ్రన్ రమ్యజ్జ్వలంతిసే
శాఖాత్యుత్తమ రాజశేఖర పదా
దున్మేషయన్ కౌముదీం
హార్దాజ్ఞాన ఘనాంధకార వితతే
ధ్వానే శీతళ్శరః
త్వం జీవ్యాగద మద్య రాజబహదూర్
మృత్యుంజయోభూరహో ౨

తనోషి యోషి ద్గణలోకకారిణీం
మహోన్నతో వాఽ వ్యయ పాఠశాలికాం
అతోభవే స్త్వమ్ముఖలాంధ్ర యోషితాం
ప్రశస్త వాచాంవిపులం సుభాజనం ౩

## సంస్థానములలో కాంగ్రెసు సంఘముల కనుమతి

### డాక్టరు పట్టాభిగారి సూచనను కాంగ్రెసు మహాసభ ఆమోదించెను

కాంగ్రెసు మహాసభా కార్యక్రమము

---

### కాంగ్రెసు మహాసభా కార్యక్రమము

#### మొదటిరోజు

హరిపురము ఫిబ్రవరి ౧౯

అధ్యక్షోపన్యాసము జరిగినతర్వాత కాంగ్రెసు మహాసభా విజయముకోరుచు నానా దిశలనుండివచ్చిన సందేశములను కార్యదర్శి ఆచార్య కృపాళినిగారు చదివిరి.

అంత గత కాంగ్రెసుమహాసభానంతరము మరణించిన దేశీయ మహనీయులనుగూర్చిన విషాద తీర్మానమును అధ్యక్షుడు ప్రతిపాదించ అందరునులేచి నిలచి ఆమోదించిరి.

తర్వాత (౧) అస్సాంలో చెరసాలయందున్న నాగజాతిస్త్రీ "గ్విడాలో"అను నామె విడుదల, (౨) బ్రిటిషు గ్వయానాలో స్థిరనివాసులైన భారతీయులు, (౩) ఖండాంతర భారతీయులు. (౪) జాంజిభారు భారతీయుల దుస్థితి. (౫) సింహళములో భారతీయులు, (౬) చైనాపై జపాను దండయాత్ర, (౭) పాలస్టెయిను విభజన, (౮) ప్రపంచ సంగ్రామభయము. విదేశ రాజ్యాంగతంత్రము, (౯) భారత రాజ్యాంగ శాసనములో మినహాయింపబడిన ప్రాంతములు, కమిషనరులక్రింద నుంచబడిన రాష్ట్రములు, (౧౦) అజ్మీరు, మేర్వారాలో కొన్ని భాగములను జోధపూరు సంస్థానమునకు ఇచ్చుట — ఈ విషయములనుగూర్చి విషయ నిర్ణయసంఘములో ఆమోదింపబడిన తీర్మానములు అధ్యక్షునిచే ప్రతిపాదింపబడి ఆమోదించబడెను.

పెడరేషను

తర్వాత ఫెడరేషను గూర్చిన తీర్మానమును పండిత గోవింద వల్లభపంతు గారు ప్రతిపాదించిరి. దానిని భూలాభాయి దేశాయిగారు బలపరచిరి తీర్మాన మామోదించబడెను.

#### రెండవరోజు

హరిపురము ఫిబ్రవరి ౨౦

వందేమాతరం ప్రార్థన తర్వాత సుభాసు బోసుగారు మహాసభకువచ్చిన మరికొన్ని సందేశములను చదివిరి.

తర్వాత అధ్యక్షులవారు తెన్యాన గూర్చియు, మిద్నపూరు కాంగ్రెసు సంస్థలనుగూర్చియు చేయబడిన తీర్మానములను ప్రతిపాదించగా అవి ఆమోదించబడెను. మిద్నపూరు తీర్మానము మిద్నపూరులో ౧౧౦ కాంగ్రెసు సంస్థలపై బెంగాలు ప్రభుత్వమువారిచే విధించబడిన నిషేధము ఇంకను ఉండరాదని సూచించుచున్నది.

తర్వాత జాతీయవిద్యను గూర్చిన తీర్మానమును బాబు పురుషోత్తమదాసు టాండనుగారు

## బ్రిటను విదేశాంగ మంత్రి రాజీనామా

### ప్రధానమంత్రి–విదేశాంగమంత్రి విభేదాభిప్రాయములు

లండన్ ఫిబ్రవరి ౨౦

అంతర్జాతీయ రాజకీయ సమస్యలందు బ్రిటను ప్రధానమంత్రి చెంబర్లేన్ గారికిని, విదేశాంగమంత్రి ఆంథోని ఈడెన్ గారికిని విభేదాభిప్రాయములు కలుగుటచే నేడు రాజీనామా

నూతన విదేశాంగ మంత్రిగా నియమింపబడిన లార్డ్ హాలిఫాక్సు

నొసగిరి. ఈడెన్ గారి స్థానే తాత్కాలికముగా లార్డ్ హాలిఫాక్సు (ఇర్విన్ ప్రభువు)గారు విదేశాంగమంత్రిగా నియమింపబడినారు.

ఆంథోని ఈడెన్ గారు ౧౯౩౫ సంవత్సరములో సర్ సామ్యూల్ హోరుగారు రాజీనామా నొసగుటచే విదేశాంగమంత్రిగా నియమింపబడిరి. ఈడెన్ గారు ౨ యేండ్ల ౨ నెలలు విదేశాంగ మంత్రిత్వభారమును వహించియుండిరి.

---

ప్రతిపాదించిరి. అది ఆమోదించబడెను.

అల్పసంఖ్యాకుల హక్కులను గూర్చిన తీర్మానమును జవహర్లాలుగారు ప్రతిపాదించిరి. ఎక్కువ చర్చలేకుండ తీర్మానము ఆమోదించబడెను.

సంస్థాన ప్రజలు

సంస్థాన ప్రజలనుగూర్చిన తీర్మానమును జయరాందాస్ దౌలతురాంగారు ప్రతిపాదించిరి. చాల చర్చజరిగెను. సంస్థానములలో సంఘములులేనిచోట క్రొత్త సంఘములను స్థాపించుట కనుమతినిచ్చుటకును, శాసనసభా కార్యములలో సంస్థాన కాంగ్రెసు సంఘములు పాల్గొనుట కనుమతినిచ్చుటకును సూచించు రెండు సవరణలురాగా సర్దార్ వల్లభాయి పటేలుగారు తీవ్రముగా ప్రతిఘటించిరి. డాక్టర్ పట్టాభిగారు విషయనిర్ణయసభలో ఆమోదించబడిన అసలు తీర్మానమును సమర్థించిరి తుదకు రెండు సవరణలును నిరాకరించబడెను. అసలు తీర్మానము ఆమోదించబడెను.

అంతటితో సమావేశము ముగిసెను.

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad. Editor K Balakrishna Reddy